Tel. 1612

W. 46130
1993

# శనిప్రదోషవ్రతము.

అథా గణపతి పూజాంకృత్వా॥ ... ... ఆచమ్య ... సంకల్ప్య॥ పూర్వోక్త ఏవంగుణ ... ... ... శుభతిథౌ । మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య ... ప్రీత్యర్థం మమ సమస్త పాపక్షయార్థం మమ పూర్వజన్మని మత్కృత ఋణాది కష్టవిముక్త్యర్థం పుత్ర పౌత్రాభివృద్ధ్యర్థం శనిప్రదోషవ్రతం కరిష్యే । ఇతి సంకల్ప్య । అథ గణాధిపతిపూజాం విధిప్రకారేణచకృత్వా । తతః ప్రతిమాశోధనంచకృత్వా । వేదోక్తవిధినా వేదోక్తమంత్రైః కార్యం తతః ధ్యానమ్ ॥ శ్లో॥ ఆవాహయే త్ప్రథమతో । మంత్రేణానేన సువ్రితమ్ । ఏహ్యేహిత్వ ముమాకాంత । స్థానే నాత్ర స్థిరోభవ । యావద్వ్రతం సమాప్యేత । కృపయా దీనవత్సల । శ్రీ ఉమామహేశ్వరాభ్యాంనమః ఆవాహవం సమర్పయామి । శ్లో॥ ఆసనే ఽస్మిన్నుమాకాంత । సుఖస్పర్శేతు నిర్మలే । ఉపవిశ్య మృడేదానీం । సర్వ శాంతిప్రదోభవ । ఆసవం సమర్పయామి । శ్లో॥ పాద్యంచతే మయాదత్తం । పుష్పగంధ సమన్వితమ్ । గృహాణ దేవదేవేశ । ప్రసన్నో వరదోభవ । పాద్యం సమర్పయామి । శ్లో॥ తామ్రపాత్రే స్థితం తోయం । ఫలగంగాది సంయుతమ్ । అర్ఘ్యం గృహాణదేవేశ । మయాదత్తం హితభక్తితః । అర్ఘ్యం సమర్పయామి । శ్లో॥ శీతలం నిర్మలతోయం కర్పూరేణ సువాసితమ్ । ఆచమ్యతాం సురశ్రేష్ఠ మయాదత్తం హి...భక్తితః ॥ ఆచమనీయం సమర్పయామి ॥ శ్లో॥ పంచామృతేన స్నపనం తత్తన్మంత్రైశ్చ కారయేత్ । గో క్షీర ధామ దేవేశ గోక్షీరేణ మయాకృతమ్ ॥ స్నపనం దేవదేవేశ । గృహాణ పరమేశ్వర ॥ క్షీరస్నానం సమర్పయామి । శ్లో॥ దధ్నాచైవ మయాదేవ స్నపనం క్రియతేతవ । గృహాణ భక్త్యాయద్దత్తం ప్రసన్నో మే భవావ్యయ । దధ్నా స్నపయామి ॥ శ్లో। సర్పిషా దేవదేవేశ స్నపనం క్రియతేమయా ఉమాకాంత గృహాణేదం శ్రద్ధయా సురసత్తమ ఘృతస్నానం స...మి ॥ శ్లో॥ ఇదం మధుమయాదత్తం తవ తుష్ట్యర్థ

## శని ప్రదోష వ్రతము.

...వచ । గృహాణ శంభోత్వం భక్త్యా మమ కాంతిప్రదోభవ॥ మధు స్నానం స...మి ॥ శ్లో॥ సితయా దేవదేవేశ స్నపనం క్రియతేమయా గృహాణ శంభోమే భక్త్యా సుప్రసన్నోభవ ప్రభో ॥ శర్కరస్నానం స...మి ॥ శ్లో॥ కావేరీనర్మదా వేణీ తుంగభద్రా సరస్వతీ। గంగాచ యమునా చైవ తాభ్యస్స్నానార్థ మాహృతమ్ ॥ గృహాణత్వ ముమా కాంత సర్వతీర్థాహృతంజలమ్ ॥ శుద్ధోదకస్నానం స...మి॥ శ్లో॥ ఏత ద్వాసో మయాదత్తం సోత్తరీయం సుశోభనమ్ । గృహాణత్వం సుర శ్రేష్ఠ మమనాసః ప్రదోభవ ॥ వస్త్రం స...మి ॥ శ్లో॥ యజ్ఞోపవీతం సౌవర్ణం మయాదత్తంచ శంకర । గృహాణ పరయా తుష్ట్యాతుష్టిదో భవ సర్వదా ॥ ఉపవీతం స...మి ॥ శ్లో॥ సుగంధం చందనం దివ్యం మయాదత్తం తవప్రభో । భక్త్యా పరమయా శంభో సుగంధం కురు మేభవ ॥ చందనం స...మి ॥ శ్లో॥ అక్షతాః ప్రీహి సంభూతా రత్నాఢ్యాశ్చాప్య ఖండితాః । అలంకారాయ భూయాసు। ర్మద్దత్తా శ్శివమండితాః ॥ అక్షతాన్ స...మి ॥ శ్లో॥ మాలతీ చంపకాదీని కుసుమదాన్యుత్పలానిచ । బిల్వపత్రాణి పూజార్థం । స్వీకురుత్వ ముమాపతే ॥ పుష్పాణి సమర్పయామి ॥

ఓం మహాదేవాయనమః । దేవాయనమః । శంభవే నమః । శంకరాయ- వృషవాహనాయ- నీలకంఠాయ- చతుర్బాహవే- పంచవక్త్రాయ- త్రిలోచనాయ- మహారుద్రాయ- మహానందినే- మహాకాలాయ- గణేశ్వరాయ- మహామాయామయాయ- సౌమ్యాయ- సర్వజ్ఞాయ- భక్తవత్సలాయ- పార్వతీరమణాయ- సిద్ధాయ- సాధ్యాయ- నారాయణప్రియాయ- చంద్రార్ధమస్తకాయ- స్థాణవే- జితశత్రవే- జితేంద్రియాయ- అనంతాయ- సకలానందాయ- సహస్రాక్షాయ- సనాతనాయ- కైలాసనిలయాయ- శాంతాయ- కామినే- కామాంగనాశనాయ- నిర్గుణాయ- నిష్కళాయ- నిత్యాయ- నిర్వికల్పాయ- నిరంజనాయ- కృత్తివాససే- జట్టినే- శూలినే- పినాకినే- పింగళలోచనాయ- గంగాధరాయ- సురశ్రేష్ఠాయ- సువ్రతాయ- సుప్రభాకరాయ- పురుషాయ- పుష్కరాయ- శూరాయ- పూర్ణా ... రాయ- సంహారమూర్తయే- విశ్వాత్మనే- వేదా

త్మనే- కరుణాకరాయ- త్రిగుణాత్మనే- త్రిలోచనాయ- త్రిమూర్త యే- త్రిపురాంతకాయ- ఉగ్రాయ- సేనాపతయే- స్కందాయ- శ్మ శాననిలయాయ- భవాయ- వీరభద్రాయ- విరూపాక్షాయ- జగ ద్వక్త్రాయ- గణాధిపాయ- క్షేత్రపాలకాయ-కపాలినే- కమలేక్షణాయ దేవదేవాయ- జగన్నాథాయ- జగద్వంద్యాయ- జగద్గురవే జగ త్కర్త్రే- జగత్సాక్షిణే- జగదాత్మనే-జనార్దనాయ-అష్టమూర్తయే- అనాద్యంతాయ- శుద్ధదేహాయ- ఉత్తమోత్తమాయ-అతిస్నిగ్ధాయ- అతిగంభీరాయ- రౌద్రాయ- సంకర్షణాయ- హరాయ- మహాబలా య- అంధరిపవే- మహాతేజసే- హుతాశనాయ- భూతనాథాయ- జగద్యోనయే- భస్మశాయినే- మహేశ్వరాయ- భక్తప్రియాయ- మహాయోగినే- భోగినే- కల్యాణవతే- ప్రభవే- అంతర్వ్యాపినే- త్రిధామ్నే- వాచస్పతయే- ఉమాః పతయే- సర్వపాపహరాయనమః॥

శ్లో॥ ధూప విశిష్టం పరమం సర్వౌషధి విజృంభితమ్ గృహాణ పరమేశాన మమో పరిదయాంకురు ॥ ధూపం సమర్పయామి ॥ శ్లో॥ దీపంచ పరమంశంభో ఘృతవర్తిషు యోజితమ్ । దత్తం గృహాణ దేవేశ మమ జ్ఞానప్రదోభవ ॥ దీపం స...మి ॥ శ్లో॥ శాల్యోదన ఘృతాపూప పాయసాది సమన్వితమ్ । నైవేద్యం వివిధం దత్తం భక్త్యామే ప్రతిగృహ్యతామ్ ॥ నైవేద్యం స...మి ॥ శ్లో॥ నైవేద్య మధ్యే పానీయం మయాదత్తంహి భక్తితః । స్వీకురుష్వ మహాదేవ ప్రసన్నో భవసర్వదా ॥ మధ్యే పానీయం స...మి ॥ శ్లో॥ ఉత్తరా పోశనార్థంవా । ఆనీతం జలముత్తమమ్ । గృహాణత్వ ముమాకాంత సర్వదుంఖ నివారక । ఉత్తరాపోశనం స...మి॥ శ్లో॥ కర్పూరై లాల వంగాది పూగీఫల సమన్వితమ్ । తాంబూలం కల్పితంభక్త్యాగృహాణ గిరిజాప్రియ ॥ తాంబూలం స...మి ॥ శ్లో॥ ఇదం ఫలంమయా దేవ స్థాపితం పురస్తవ । తేనమే సఫలావాప్తి ర్భవేజ్జన్మని జన్మని॥ ఫలాని స...మి ॥ శ్లో॥ హిరణ్యగర్భ గర్భస్థం హేమ బీజం విభావసోః । దక్షిణా కాంచనీ దేవ స్థాపితా చాగ్రతస్తవ ॥ దక్షిణాం స...మి ॥ శ్లో॥ దీపావళీ మయాదత్తా సువర్తి ఘృతసంయుతా। పం చార్తిక్య ప్రదానేన మమ తేజః ప్రదోభవ ॥ పంచార్తిక్య దీపం

స...మి॥ సహస్రశీర్ష దేవం ... ... ఓమ్॥ మంత్రపుష్పం స ... మి॥ శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ। తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥ ప్రదక్షిణాన్ స...మి॥ శ్లో॥ మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే। అమృతేశాయ శర్వాయ మహాదేవాయతేనమః॥ నమస్కారాన్ సమర్ప... మి॥ శ్లో॥ చామంతికా వకుళ చంపక పాటలాద్యైః పున్నాగజాతి కరవీర రసాలపుష్పైః బిల్వప్రవాళ తులసీదళ మాలతీ భిస్త్వాం పూజయామి జగదీశ్వర మేప్రసీద॥ నానావిధ పుష్పం స...మి॥ శ్లో॥ నిపత్య దండవద్భూమౌ ప్రణమ్యచ పునఃపునః। తోషయిత్వా దేవేశంరాత్రౌ జాగరణం చరేత్॥ గీతవాద్యత నృత్యాద్యైః గృహేవా దేవతాలయే పంచపూజా ప్రకర్తవ్యా శంకరస్య చతుష్టిదా॥ ఈప్సితంచ శరాణాం తు దదాతు భగవాన్ హరః॥ అథ ప్రార్థనం కుర్యాత్॥

శ్లో॥ నమో రుద్రాయ భీమాయ। నీలకంఠాయ వేధసే। కపర్దినే సురేశాయ। వ్యోమకేశాయ వైనమః॥ వృషధ్వజాయ సోమాయ। సోమనాథాయవైనమః। దిగంబరాయ భర్గాయ। ఉమేశాయ కపర్దినే। తపోమయాయ వ్యాసాయ। శిపివిష్టాయవైనమః॥ వ్యాళప్రియాయ వ్యాళాయ। వ్యాళానాం పతయే నమః॥ మహీధరాయ వ్యాఘ్రాయ। పశూనాం పతయేనమః॥ త్రిపురఘ్నాయ సింహాయ శార్దూలాయ ఋషభాయచ॥ మితాయ మితనాథాయ। సిద్ధాయ పరమేష్టినే। కామాంతకాయ బుద్ధాయ। బుద్ధీనాంపతయే నమః॥ కపోతాయ విశిష్టాయ। శిష్టాయ పరమాత్మనే। వేదవిత్తాయ గుప్తాయ వేదగుహ్యాయవైనమః॥ దీర్ఘాయ దీర్ఘరూపాయ। దీర్ఘార్థాయ మృడాయచ। నమో జగత్ప్రతిష్టాయ। వ్యోమరూపాయవై నమః॥ గర్వకృత్సు మహాదైత్య। అంధకాసురీ భేదినే। నీలలోహిన శుక్లాయ। చండముండ ప్రియాయచ॥ భక్తప్రియాయ దేవాయ। జ్ఞాతాజ్ఞాతా వ్యయాయచ। మహేశాయ నమస్తుభ్యం। మహాతేచ హరాయచ। త్రినేత్రాయ త్రివేదాయ। వేదాంగాయ నమోనమః। అర్థాయ అర్థరూపాయ। పరమార్థాయవైనమః॥ విశ్వరూపాయ విశ్వాయ విశ్వనాథాయవైనమః। శంకరాయచ కాలాయ। కాలావ

యవరూపిణే। అరూపాయ విరూపాయే। సూక్ష్మ సూక్ష్మాయవై నమః। శ్మశానవాసినే తుభ్యం। నమస్తే కృత్తివాసనే। శశాంక శేఖరాయైవ। రుద్రభూమ్యాశ్రయాయచ। దుర్గాయ దుర్గరూపాయ। దుర్గావయవసాక్షిణే॥ లింగరూపాయ లింగాయ। లింగానాం పతయేనమః। నమః ప్రభావరూపాయ। ప్రణవార్థాయవై నమః॥ నమోనమః కారణకారణాయ మృత్యుంజయాయాత్మ భవస్వరూపిణే త్ర్యంబకాయా సితకంఠ భర్గగౌరీపతే మంగళహేతవే నమః॥

శ్లో॥ యస్యస్మృత్యాచ నామోక్త్యా తపో హోమక్రియాదిషు। నం సంపూర్ణతాం యాతి ద్యోవందే తమచ్యుతం॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వర। యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥ అనయా పూజయా మహేశ్వరః ప్రీణాతు॥ ఇతి పూజావిధి సమాప్తః॥

---

## శనిప్రదోషవ్రతమాహాత్మ్యమ్

మూలమ్॥ ఆషాఢశుక్ల త్రయోదశ్యాం జయా పార్వతీవ్రతమ్ దేశాంతరే కుర్వంతీతి భవిష్యోత్తరే॥

తా॥ ఆషాఢశుక్ల త్రయోదశియందు జయమునొసఁగు పార్వతీ వ్రతమును మఱియొక దేశమందుఁ జేయుచున్నారని భవిష్యోత్తర పురాణంబునఁ జెప్పఁబడియున్నది

మూ॥ అథ భాద్రపదశుక్ల త్రయోదశ్యాం గోత్రిరాత్రం హేమాద్రౌ భవిష్యోత్తరే ఘూర్జరేషు ప్రసిద్ధమ్॥

తా॥ భాద్రపద శుక్ల త్రయోదశీ దినంబున ఘూర్జర దేశముల యందు గోత్రిరాత్రవ్రతమును జేయ ప్రసిద్ధిగలదని హేమాద్రియను ధర్మశాస్త్రమందును భవిష్యోత్తరపురాణంబునను జెప్పఁబడినది.

మూ॥ అథ ఆశ్వీయుజశుక్ల త్రయోదశ్యాం అశోక త్రిరాత్రవ్రతం భవిష్యే। దక్షిణదేశేషు ప్రసిద్ధం॥

తా॥ ఆశ్వీయుజశుక్ల త్రయోదశియందు దక్షిణదేశములయందు అశోక త్రిరాత్రవ్రతమును ప్రసిద్ధిగా జేసెదరని భవిష్యోత్తర పురాణంబున జెప్పఁబడియున్నది.

# శ ని ప్ర దో ష వ్ర త ము .

మూ॥ చైత్రి కృష్ణ త్రయోదశ్యాం మహావారుణి సంజ్ఞికో యోగః । తదుక్తం వాచస్పతి నిబంధే ।

తా॥ చైత్రబహుళ త్రయోదశియందు మహావారుణి యను పేరుగల యోగము కలుగునని వాచస్పతి నిబంధమను గ్రంథంబునఁ జెప్పఁబడినది.

శ్లో॥ శనివార సమాయుక్తా సా మహావారుణీ స్మృతా । మధౌ కృష్ణ త్రయోదశ్యాం శనౌ శతభిషాయది ।

తా॥ చైత్రబహుళత్రయోదశియందున శనివారముకూడి శత భిషానక్షత్రము కలిసెనేని ఆదినంబు మహావారుణియని చెప్పబడినది.

శ్లో॥ గంగాయాం యదిలభ్యేత కోటిసూర్య గ్రహాధికా। శుభ యోగ సమాయుక్తా శనౌ శతభిషాయది । మహామహేతి విఖ్యాతా త్రికోటి కులముద్ధరేత్ ।

తా॥ కోటి సూర్యులతో సమాన ప్రభావము గలదియు మంచి యోగములతో గూడినదియు శనివార శతభిషానక్షత్రముల కూటమి గలదియునైన మహావారుణియను పేరుగల యోగమునందు గంగానది లో స్నానము జేసి దానాదుల జేయునేని మూఁడుకోట్ల వంశస్థులగు తన పూర్వాపర పితృదేవతలు తరించఁగలరు.

అ థ క థా ప్రా ర ం భ ః .

శ్లో॥ అథ స్కాందపురాణే శనిత్రయోదశీవ్రతం సూతః ।

తా॥ సూతుండు స్కాందపురాణంబున శనిత్రయోదశీ వ్రత మునుగూర్చి యిట్లుచెప్పెను.

శ్లో॥ శనౌ శుక్లత్రయోదశ్యాం శ్రావణే కార్తికేఽపివా । జయా పూర్వాపరా గ్రాహ్యా వ్యాప్తాచేద్రజనీముఖం ।

తా॥ శ్రావణమాసంబునగాని కార్తీకమాసంబునగాని శనివా రములోగూడిన శుక్లత్రయోదశియందు సాయంకాలమునకు ముందు గాగాని వెనుకగాని సాయంకాలమందుఁగాని శతభిషానక్షత్రము వ్యా పించెనేని నది విశేషఫలము నిచ్చునదిగా జెప్పబడినౌ.

లోమశః ।శ్లో॥ పురావృత్రాదిభి ర్దైత్యైర్వ్యర్థమానే మహా

తా॥ రోమశ మహాముని చెప్పుచున్నాడు. పూర్వకాలమందు దేవేంద్రునకు వృత్రుడు మొదలగు రాక్షసులకును జరిగిన యుద్ధమందు బలవంతుండగు నముచియను రాక్షసుఁడు దేవేంద్రునిచే నభిమంత్రింపఁబడి ప్రయోగింపఁబడిన నీళ్ళనురుగుచేఁ జంపఁబడెను.

శ్లో॥ దైత్యాః పలాయితాః దృష్ట్వా హన్యమానా స్సురై ర్భృశమ్ । వృత్రః కోపసమావిష్టో దేవాన్యోద్ధు మథాయయౌ ।

తా॥ దేవతలచే నోడిపోయి రాక్షసులందరు మిగులఁ బాఱిపోవుటనుజూచి వృత్రాసురుఁడు మిక్కిలి కోపముపొంది దేవతలతో యుద్ధము చేయుకొఱకు వచ్చెను.

శ్లో॥ కాలాగ్ని రూపసదృశం రూపంకృత్వా మహాహవే। వ్యవర్ధత మహాతేజా రోదసీ పూరయన్నివ ।

తా॥ ప్రళయ కాలమందు బయలు వెడలెడు వగ్నిహోత్రుని వగిది యుద్ధమందు భయంకరమైన రూపముగలవాడై మిక్కిలి పరాక్రమము గలవాడై భూమ్యాకాశ మధ్యప్రదేశము నిండునట్లుగా పెద్ద శరీరము గలవాఁడయ్యెను.

శ్లో॥ తందృష్ట్వా భయవిత్రస్తా దేవాశ్శక్ర పురోగమాః । క ర్తవ్యం నాభ్యపద్యంతి తతో గురు రువాచహ ।

తా॥ దేవేంద్రుడు మొదలగు దేవతలు ఆ వృత్రాసురుని శరీరముఁజూచి భయముజెంది ముందు చేయుదగిన కార్యమును గుర్తెఱుంగరైరి. అనంతరము దేవగురుండైన బృహస్పతి యిట్లు చెప్పెను.

శ్లో॥ తపసాసు మహోగ్రేణ వ్రతేన నియమేనచ । అజేయోయం మహాతేజాః వృత్రశ్శత్రు నిబర్హణః ।

తా॥ వృత్రాసురుఁడు తీక్ష్ణమైన తపస్సుచేతను నియమముతో గూడిన వ్రతముచేతను విశేషమైన పరాక్రమముగలవాఁడై శత్రువులను జయించుచు నితరులకు జయింప నలవికానివాఁడాయెను.

శ్లో॥ ఆరాధ యతతం దేవం పూజ్యం శంకర మవ్యయమ్ । వ్రతేన విధియుక్తేన వృత్రం జేష్యథ మాచిరం ।

తా॥ పూజ్యుడును నాశనరహితుఁడును మంగళ ప్రదుండును నగు నా సాంబమూర్తిని యథావిధిగాఁ బూజించిరేని వృత్రాసురుని జయింపగలరు కాన ఆలస్యముఁ జేయకుఁడు.

దేవాః ॥శ్లో॥ గురో కేన విధానేన కీదృశేన వ్రతేనచ । ఆరాధనీయో గౌరీశ స్త్వస్మాభిర్జయ కాముకైః । తద్వదస్వసురాచార్యత్వం హినః పరమాగతిః ॥

తా॥ దేవతలడుగుచున్నారు, ఓ గురువా! జయమును గోరువారమై మేమే వ్రతముచే నేవిధంబుగా సాంబమూర్తిని బూజింపవలయునో దేవగురుండవగునో బృహస్పతీ! దానినిజెప్పుము. మమ్ముల రక్షించువారు మీకన్న నితరులులేరు

గురుః ॥ శ్లో॥ కార్తికాదిషు మాసేషు మందవారే త్రయోదశీ । విశేషా చ్ఛుక్లపక్షేతు సర్వకామకరీ స్మృతా ॥

తా॥ బృహస్పతి చెప్పుచున్నాడు. కార్తికాది మాసముల యందు శుక్లపక్ష త్రయోదశి శనివారముతోఁగూడెనేని అతిథి విశేషముగాఁగోరి కలనొసఁగునదిగాఁ జెప్పఁబడినది.

శ్లో॥ తస్యాం ప్రదోషసమయే లింగరూపీ సదాశివః । పూజనీయోహి దేవేంద్ర సర్వకామ సమృద్ధయే॥

తా॥ ఓ దేవేంద్రుడా ! ఆదినంబున సాయంకాలమందు లింగస్వరూపముగానుండు సాంబమూర్తిని బూజచేయవలయును.

శ్లో॥ స్నాత్వా మధ్యాహ్న సమయే తిలామలక సంయుతమ్ । శివస్య చార్చనం కుర్యాద్గంధపుష్ప ఫలాదిభిః ॥

తా॥ తిలలు ఉసిరికపప్పు వీనితో మధ్యాహ్న కాలంబున స్నానముఁజేసి గంధము పుష్పము ఫలములు మొదలగువానిచే శివుని బూజ సేయవలయును.

శ్లో॥ పశ్చాత్ప్రదోషసమయే స్థావరం లింగమర్చయేత్ । స్వయంభు స్థాపితంచాపి పౌరుషేయ మపౌరుషమ్ ॥

తా॥ అనంతరము బ్రహ్మచే నిర్మింపఁ బడ్డినదిగాని లేక దేవ నిర్మితమైనదిగాని మనుష్య నిర్మితమైనదిగాని స్థిరముగానుండు లింగ

శ్లో॥ జనేవా విజనేవాపి అరణ్యేవా తపోవనే ।

తా॥ మనుష్యులుండు ప్రదేశమందుఁగాని నిర్జనప్రదేశమందు గాని అరణ్యమందుఁగాని మునీశ్వరులు తపస్సుఁ జేసికొనియెడి స్థలమందుఁగాని యుండెడి లింగములఁ బూజింపవచ్చును.

శ్లో॥ గ్రామాద్బహిస్థితం లింగం గ్రామా చ్ఛతగుణంభవేత్। బాహ్యే చ్ఛతగుణం పుణ్యమరణ్యేచ పరిపూజనమ్ । వన్యా చ్ఛతగుణం పుణ్యం లింగం పర్వతస్థితం । పర్వతాచ్ఛాయుతం పుణ్యంతపోవన సమాశ్రితం। కాశ్యాంతుసంస్థితంలింగం పూజితం స్యాదనంతకం।

తా॥ గ్రామమునకు వెలుపలనుండు లింగమును బూజించెనేని గ్రామమునందుండు లింగంబునకంటె నూరురెట్లు ఫలము నొసఁగును. అరణ్యమందుండు లింగము దానికి నూరురెట్లు ఫలము నొసఁగును. పర్వతమందుండు లింగము అరణ్యలింగముకంటె నూరురెట్లు ఫలము నొసఁగును. తపోవనమందుండు లింగము పర్వతమందుండు లింగంబునకంటె పదివేలరెట్లు ఫలమునొసఁగును. కాశీ నగరమందుండు లింగమును బూజించిన అమితమైన ఫలము కలుగును.

శ్లో॥ ఏవం విశేషం లింగానాం తీర్థానాం నిపుణైర్బుధైః జ్ఞాత్వాచ శివపూజయాః విధిం శంభుం పరిపూజయేత్ ।

తా॥ ఈప్రకారము నిపుణులైనవారు లింగములయొక్కయు తీర్థములయొక్కయు తారతమ్యమును గుర్తెరింగి శివపూజావిధానంబును దెలిసికొని యవశ్యము సాంబమూర్తిని బూజింపవలయును.

శ్లో॥ కూపవాపీ తటాకేషు దేవఖాంతనదీషు చ। క్రమా చ్ఛతగుణం పుణ్యం గంగాయాం స్యాదనంతకం ।

తా॥ నూతుల సమీపంబునగాని దిగుడుబావుల సమీపంబునఁగాని చెఱువులు సరస్సులు నదులు మొదలగువాని సమీపంబునఁగాని శివపూజను క్రమముగాఁ జేసిన నూఱురెట్లు పుణ్యము కలుగును. గంగానదిరొడ్డునఁ జేసిన నమితమైన ఫలముకలుగును.

శ్లో॥ పంచపిండాన్ సముద్ధృత్య సుస్నాయాత్పరవారిణి । తతః ప్రదోషసమయే స్నాత్వా మౌనం సమాచరేత్ ।

తా॥ అయిదు పిండములను ఆజలమునందుంచి అనంతరము సాయంకాలంబున మఱియొక నీటియందు స్నానముచేసి మౌన వ్రతుడై యుండవలయును.

శ్లో॥ ప్రదీపానాం సహస్రేణ దీపనీయ స్సదాశివః । శతేనాప్యధవా దేవో ద్వాత్రింశద్దీప మాలయా । ఘృతేన దీపయేద్దీపాన్ శివస్య పరితుష్టయే ।

తా॥ నేతిచే వెలిగింపబడినవియు నూటిగాని ముప్పది రెండుగాని వేయిగాని దీపములచే సాంబమూర్తిని ఆయన సంతోషించుటకొఱకు ప్రకాశింపఁ చేయవలయును.

శ్లో॥ తథాఫలైశ్చ ధూపైశ్చ నైవేద్యైర్వివిధై రపి। ఉపచారైష్షోడశ భిర్లింగ రూపీ సదాశివః । పూజ్యః ప్రదోష సమయే నృభిస్సర్వార్థసిద్ధయే । నామ్నాం శతేన రుద్రో సౌ స్తోతవ్యశ్చ స్తుతిప్రియః॥

తా॥ ఆప్రకారముగా మనుష్యులు సమస్తమైన కోరికలనుబొందుటకొఱకు లింగరూపుండగు సాంబమూర్తిని ఫలములచేతను ధూపములచేతను అనేకమైన నైవేద్యములచేతను షోడశోపచారములచేతను సాయంకాలంబునఁపూజించి స్తోత్రప్రియుండైన సాంబమూర్తిని శతనామావళిచే స్తోత్రము జేయువలయును.

శ్లో॥ నామ్నాం శతం మహేశస్య ఉచ్చార్యం ప్రతినాసదా ప్రదక్షిణ నమస్కారానే త్సంఖ్యాన్ ప్రయత్నతః । కార్యాః ప్రదోషసమయే తుష్ట్యర్థం శంకర చ ।

తా॥ అట్లు వ్రతముచేయు పురుషుండు సాంబమూర్తి సంబంధమగు నూరునామములను చెప్పి నూఱుప్రదక్షిణ నమస్కారములను శ్రద్ధతోజేసి సాంబమూర్తిని సంతోషించుటకొఱకు ప్రదోష కాలమందు యథావిధిగా బూజింప వలయును.

శ్లో॥ ఏతద్వ్రతం మయాదిష్టం తవశక్ర మహామతే । శీఘ్రం కురు మహాభాగ పశ్చాద్యుద్ధ కురుప్రభో । శంభోః ప్రసాదాత్సర్వంతే భవిష్యతి జయాదికం ।

తా॥ గొప్ప బుద్ధిమంతుడా ! మిక్కిలి భాగ్యము గలవాడా ప్రభువా । దేవేంద్రుడా । నాచేఁజెప్పఁబడిన యీవ్రతమును నీవు

శీఘ్రముగాఁజేసి యనంతరము యుద్ధముచేయునూ— సాంబమూర్తిగా యనుగ్రహమువలన సమస్తవిధముల నీకు జయముకలును.

శక్రః । శ్లో। వృత్రఃకదా మహేశానం సమారాధ యదాద రాత్ । కథంచ సవరం ప్రాప్తః పురాకశ్చా భవద్విజః ।

తా। ఓ బృహస్పతీ ! వృత్రాసురుండెప్పుడు సాంబమూర్తిని అత్యాదరముతో సేవించెను, అతండెట్లు వరమును బొందెను. పూర్వ మాతం డేవిధమునానుండెను- వీని యదార్థమునంతయుఁ జెప్పుమని దేవేంద్రుఁడు బృహస్పతి నడిగెను.

గురుః । శ్లో। వృత్రోహ్యాయం మహాతేజా స్తపస్వీ తపసా పురా । శివం ప్రసాదయామాస పర్వతే గంధమాదనే ।

తా। విశేషమైన పరాక్రమముగల యావృత్రాసురుఁడు మునీశ్వర చిహ్నములనుధరించి గంధమాదనంబను పర్వతమునందు తపస్సుఁజేసి శివుని యనుగ్రహమును పొందెను.

శ్లో। నామ్నా చిత్రరథో రాజా-వనం చిత్రరథస్య తత్ । ఏత జ్జానీహి భో ఇంద్ర తవపుర్యా స్సమీపతః

తా। ఓ ఇంద్రుడా ! చిత్రరథుండను నొకరాజుగలఁడు. నా పట్టణమునను సమీపమందుండువనం బచిత్రరథునిదిగాఁ దెలియుము

శ్లో। యస్మిన్వనే మహాభాగ వసంతిచ మహర్షయః । తస్మా చ్చైత్రరథంనామ వనం పరమ మంగళం ।

తా। భాగ్యశాలీ ! ఈ చైత్రరథంబను వనమునందు మహామునీశ్వరులు నివాసము చేయుటచే ఇది మిక్కిలి మంగళప్రదమైనదని చెప్పఁబడెను.

శ్లో। తస్యదత్తం శివేనైవ యానంచ పరమాద్భుతమ్ । కామదం కింకిణీయుక్తం సిద్ధచారణ సంయుతం గంధర్వై రప్సరో యుక్తైః కిన్నరైరుప శోభితమ్ ।

తా। మిక్కిలి యాశ్చర్యమును గలుగఁజేయునదియుఁ, కోరికల నిచ్చునదియు, చిఱుగంటచేఁ గూర్పబడినదియు, సిద్ధులు చారణులు గంధర్వులు అప్సరసలు [illegible]

నిండియుండినదియునగు నొకవిమానమును సాంబమూర్తి చిత్రరథుఁడు చేసిన తపస్సునకు మెచ్చి యాతనికిచ్చెను.

శ్లో॥ తతస్తేనైవ యానేన పృథివీం పర్యటన్పురా । తథాగిరి సముద్రాంశ్చ ద్వీపాంశ్చ వివిధాంస్తథా ॥ ఏకదా పర్యటన్ రాజా నామ్నా చిత్రరథో మహాన్ కైలాసమాగతస్తత్ర దదర్శ పరమాద్భుతమ్ ॥

తా॥ అనంతరమందా చిత్రరథుఁడను రాజు పూర్వంబున సాంబమూర్తిచే నీయఁబడిన యానము నెక్కి భూలోకమంతయు సంచరించును. నా ప్రకారంబుగా పర్వతములను సముద్రములను అనేకమైన ద్వీపములనుజూచుచు నొకానొక సమయంబున కైలాసంబున కేగుదెంచి యచ్చట నాశ్చర్యకరమగు విషయమునుజూచెను

శ్లో॥ తదా సభాం మహేశస్య గణైశ్చైవ విరాజితమ్। అర్ధాంగలగ్నయా దేవ్యా శోభితం చ మహేశ్వరమ్ ॥

తా॥ ఆశ్చర్యమగు విషయమేమన ఆ సభయందు తన సంబంధమగు పరివారముచే సేవింపఁబడుచున్నవాఁడును శరీరములో సగభాగంబుననున్న పార్వతీ దేవిచే ప్రకాశించు వాఁడునగు సాంబమూర్తిని జూచెను.

శ్లో॥ నిరీక్ష్య దేవ్యాసహితం సదాశివం కర్పూరగౌరం వరదం త్రిలోచనం । కపర్దినం చంద్రకలావిభూషితం గంగాధరం దేవ వరం సభాయామ్ ॥ ప్రహస్యరాజా చ తదా గిరీశం న్యాయాన్వితం వాక్యమిదం బభాషే ॥

తా॥ ఆసభయందు పార్వతీదేవితోఁగూడఁ గూర్చుండియున్నవాఁడును యెల్లప్పుడు మంగళముల నొసంగువాఁడును కర్పూరము వలెనె తెల్లని దేహముగలవాఁడును వరములనిచ్చేవాఁడును మూఁడు నేత్రములు గలవాఁడును జడలనుధరించినవాఁడును చంద్రకళ నలంకారముగఁ జేసికొనినవాఁడును గంగానదిని ధరించినవాఁడును దేవతలలో శ్రేష్ఠుండగు సాంబమూర్తిని జూచి చిత్రరథుఁడు నవ్వి ముందు జెప్పఁబోవు న్యాయవాక్యమును సాంబమూర్తితోఁ బలికెను

శ్లో॥ వయంచ శంభో విషయాన్వితాశ్చ మర్త్యాదయ స్త్రీవి జితా స్తథాన్యే । నలోకమధ్యేచ మయా విలోకితాశ్చా లింగ్య కాం తాం సదసి ప్రవిష్టాః ॥

తా॥ ఓ సాంబమూర్తీ మాబోటి మనుష్యులు కొంతమంది విషయాసక్తులై స్త్రీలకు లోబడినవారై యుండిరి. భార్యను ఆలింగ నము జేసికొని సభయందుఁ గూర్చుండియున్న వానిని మూడు లోకం బుల నెచ్చటను నేఁజూచి యుండలేదు.

శ్లో॥ ఏవం వాక్యం నిశమ్యాథ గిరీశః ప్రహసన్నిదం ఉవాచ న్యాయ సంయుక్తం సర్వేషామపి శృణ్వతాం ॥

తా॥ ఈ ప్రకారము చిత్రరథుండు పలికిన వాక్యమును సాంబ మూర్తివిని నవ్వినవాఁడై న్యాయానుకూలంబైన ముందుచెప్పఁబోవు వాక్యమును అందఱు వినుచుండఁగాఁ బలికెను.

శివః ॥ శ్లో॥ మమ లోకాపవాదశ్చ సర్వేషాం నభవేద్యథా । భక్షితం కాలకూటం మే సర్వేషామపి దుర్జయః ॥

తా॥ ఇట్టి లోకాపవాద మెవరివల్లను గలుగకుండునట్లుగా నెవ రికి శక్యముకాని కాలకూటమను విషమును భక్షించితిని.

శ్లో॥ లోకాతీతంచ మేవృత్తం తథా ప్యుపహ సత్యసౌ । తత శ్చిత్రరథం దేవీ గిరిజా వాక్యమబ్రవీత్ ॥

తా॥ నా చరిత్ర లోకాతీతమైయుండినను ఈ చిత్రరథుఁడు నవ్వుచున్నాడని సాంబమూర్తి యనెను. అనంతరము పార్వతీదేవి చిత్రరథునితో నొకవాక్యము పలికెను.

పార్వతీ ॥ శ్లో॥ కథం దురాత్మనార్యస్తు శంకరశ్చోపహాసితః । మయా సహైవ మందాత్మ న్నిక్షసే కర్మణః ఫలమ్ ॥

తా॥ సత్పురుషుండైన సాంబమూర్తి నాతో అర్ధనారీశ్వరుఁ డుగాఁ గూడియుండెనని దురాత్ముండైన యీచిత్రరథుఁడు ఆక్షేపిం చెను- స్వల్పబుద్ధిగల చిత్రరథుఁడా ! నీదుష్కర్మమునకు ఫల మను భవింపఁగలవని పార్వతీదేవి చెప్పెను.

శ్లో॥ సాధూనాం సమచిత్తానా ముపహాసం కరోతియః॥ దేవో

తా॥ దేవతలలోఁగాని మనుష్యులలోగాని యెవ్వడు భేదభావములేని సత్పురుషులను జూచి నవ్వుచున్నాఁడో అట్టివానిని హీనులకంటె హీనునిగాఁ దెలిసికొనవలయును.

శ్లో॥ ఏతే మునీంద్రాశ్చ మహానుభావా స్తథా హ్యేతే ఋషయో వేదగర్భాః। తథైవ సర్వే సనకాదయో మే విజ్ఞానసిద్ధా శ్శివమర్చయంతి॥

తా॥ మహానుభావులైన యీమునీశ్వరులును చతుర్వేదముల నభ్యసించిన యీ ఋషీశ్వరులును జ్ఞానశుద్ధిగల సనకుఁడు మొదలగు సమస్తమునులును సాంబమూర్తిని బూజించుచున్నారు.

శ్లో॥ రేమూఢ సర్వేషు జనేష్వభిజ్ఞ స్త్వమేవ చైకోఽసి పరో నకశ్చన। తస్మాదతి ప్రౌఢతరం నరం త్వాం సంశిక్షయే నైవ యథా భవే స్త్వమ్॥

తా॥ ఓ మూఢుండా! సమస్తమైన మనుష్యులలో నే నొక్కఁడనే తెలిసినవాఁడనవియు నితరులెవరును దెలినవారు లేరనియు ననుకొంటివి కాఁబట్టి మిక్కిలి నేర్పుగల మనుష్యుండవైన నిన్ను ఎందుకును బనికిరానివానిఁగా శాపముచే జేయుచున్నాను.

శ్లో॥ అస్మాత్త్వత విమానాత్త్వం దైత్యో భూత్వా సుదర్మతే। మమ శాపేన దగ్ధ స్త్వం గచ్ఛాద్యచ మహీతలే॥

తా॥ దుష్టబుద్ధిగలవాఁడా! నాశాపముచే దపింపఁజేయఁబడినవాఁడవై రాక్షసుండవై యీవిమానమునుండి భ్రష్టుండవై యిప్పుడే భూలోకంబునఁ బడఁగలవు.

శ్లో॥ ఏవంశప్త స్తదా దేవ్యా భవాన్యా రాజసత్తమః। రాజా చిత్రరథ స్సద్యః పపాత సహసా దివః॥

తా॥ రాజశ్రేష్ఠుండైన చిత్రరథుఁడు ఈ ప్రకారముగా నప్పుడు పార్వతీదేవిచే శపింపఁబడినవాఁడై అప్పుడే స్వర్గలోకమునుండి శీఘ్రింబుగాఁబడెను.

శ్లో॥ ఆసురీం యోని మాపన్నో వృత్రో నామ్నా ఽభవత దా। తపసా పలమేనైవ తేష్టా సంయోజితః క్రమాత్॥

తా॥ అప్పుడు చిత్రరథుఁడు రాక్షసయోనియందుఁ బుట్టి వృత్రాసురుడను పేరుగలవాఁడై అధికమైన తపస్సుఁ జేసి బ్రహ్మను మెప్పించెను.

శ్లో॥ తపసా బ్రహ్మచర్యేణ శంభో రారాధనేనచ । వ్రతేనానచ బలీ జేతుం శక్యోన కేనచిత్ ॥

తా॥ తపస్సుచేతను బ్రహ్మచర్యముచేతను సాంబమూర్తిని సేవించుటచేతను ఈ శనిత్రయోదశీ వ్రతముచేతను వృత్రాసురుఁడు బలముగలవాఁడై యెవరిచేతను జయింపఁబడక యుండెను.

శ్లో॥ అసురేణహి భావేన వ్యంగ్యం చక్రే వ్రతంయతః। తేన చ్ఛిద్రేణ చైవాసౌ పశ్చాజ్జేయో భవిష్యతి ॥

తా॥ వృత్రాసురుఁడు రాక్షసస్వభావముచే వ్రతమును విఘ్నములు లేకుండునట్లు సమాప్తినిబొందింపలేదు- కాఁబట్టి యాదోషము వలన ఈ వృత్రాసురుఁడు జయింపఁ బడఁగలఁడు.

శ్లో॥ తస్మాత్త్వమపి దేవేంద్ర కృత్వా చేదం వ్రతం శుభమ్। హనిష్యసి మహాభాగ వృత్రం నాస్త్యత్ర సంశయః ॥

తా॥ ఓ దేవేంద్రుఁడా! విశేషఫలము నొసఁగునదౌటచే శని త్రయోదశీవ్రతమును నీవు చేసెదవేని వృత్రాసురుని సంహరించగలవు- ఇందువిషయమై సందేహములేదు.

శ్లో॥ గురో స్తద్వచనం శ్రుత్వా హృష్ట్వా చాథ శతక్రతుః । ఉద్యాపన విధిం బ్రూహి ప్రదోషస్యచ మేఽధునా ॥

తా॥ ఈ ప్రకారము చెప్పిన బృహస్పతి వాక్యమును దేవేంద్రుఁడు విని మనంతసము యీ శనిప్రదోష వ్రతమునుగుఱించి యుద్యాపనము నిప్పుడు నాకొఱకుఁ జెప్పుమని దేవేంద్రుఁడు బృహస్పతి నడిగెను-

గురుః ॥ శ్లో॥ కార్తికే శ్రావణే ప్రాప్తే మందవారే త్రయోదశీ । సంపూర్ణాతు భవేద్యాసా సమగ్ర వ్రతసిద్ధయే ॥

తా॥ కార్తికమాసంబునఁగాని శ్రావణ మాసంబునఁగాని శనివారంబుతోఁగూడిన సంపూర్ణమైన త్రయోదశి యేది గలదో అటువంటి త్రయోదశి సంపూర్ణముగా వ్రతముఁ జేసికొనుటకుఁదగియున్నది-

శ్లో॥ వృషభో రాజతః కార్యః పృష్ఠే తస్య సుపీఠకమ్। తస్యోపరి న్యసేద్దేవ ముమాకాంతం త్రిలోచనమ్ ॥

తా॥ క్రిందిభాగమున పీఠమును జేయించి దాని పైభాగమున వెండితో వృషభమును జేయించి మూఁడు నేత్రములు గలవాఁడును పార్వతికి పెనిమిటియగు సాంబమూర్తిని అవృషభముపైనుంచవలెను-

శ్లో॥ పంచవక్త్రం దశభుజ మర్థాంగే గిరిజాం సతీం। సౌవర్ణ ప్రతిమాం కృత్వా తామ్ర కుంభజలైర్యుతమ్ ॥

తా॥ మఱియు ఆ ప్రతిమ యెట్లుండవలె ననఁగా ఐదు ముఖములు గలవాఁడును పదిచేతులు గలవాఁడునగు సాంబమూర్తిని సగభాగంబున పార్వతీదేవిని బంగారుతోఁ జేయించవలెను- రాగితో నొకకుంభము జేయించి దానిలో నీళ్ళు పోయవలెను.

శ్లో॥ పంచరత్న ఫలోపేతం పంచపల్లవ శోభితమ్। చందనేన సుగంధేన మిశ్రితం శోభితం తథా ॥ రౌప్యపాత్రం తతః కృత్వా కుంభస్యోపరి విన్యసేత్ ॥

తా॥ అయిదు రత్నములను అయిదు ఫలములను అయిదు చిగురుటాకులనువుంచి పరిమళించుచున్న మంచిగంధమును కలిపి వెండితో నొకపాత్రను జేయించి దానిని ఆకుంభముపై నుంచవలయును-

శ్లో॥ అశక్తా మృణ్మయం కుంభ వంశపాత్ర మథాపివా। పర్ణ శరావం సంస్థాప్య సౌవర్ణీం ప్రతిమాం తథా ॥ శక్త్యాకృతాం ప్రతిష్ఠాప్య వస్త్రమాల్య విభూషణైః। పూజయిత్వా విధానేన రాత్రౌ జాగరణం చరేత్ ॥

తా॥ శక్తిలేని పక్షమందు మట్టి కుంభమునయినను వెదురు పాత్రమునయినను ఆకులతో నిర్మింపఁబడిన మూకుడునయిననుంచి తన శక్తిననుసరించి బంగారుచే ప్రతిమనుజేయించి యా ప్రతిమను దాని యందుంచి వస్త్రములు మాలికలు భూషణములు మొదలగు వానిచే యథావిధిగాఁ బూజచేసి రాత్రియందు జాగరణము చేయవలయును।

శ్లో॥ పుష్పమంటపికా మాఢా కృత్వా శ్రద్ధా సమన్వితః వితానమంటపం కుర్యా నానావర్ణై స్సమన్వితమ్ ॥

తా॥ అనేకరంగులుగల వస్త్రములతో చాందినీగట్టి నచ్చట పుష్పగుత్తుల మాలికలతో మంటపమునంతయు శ్రద్ధగలవాఁడై ముందుగా నలంకరింప వలయును.

శ్లో॥ తతః ప్రభాతసమయే నద్యాదౌ విమలేజలే । స్నాత్వా పునస్సమభ్యర్చ్య జుహుయాత్పాయసేనచ ॥

తా॥ అనంతర ముదయంబున లేచి నదికివెళ్ళి యచ్చట నిర్మలమైన నీటిలో స్నానముజేసి తిరిగి స్వామిని పూజఁజేసి పరమాన్నముతో హోమముఁ జేయవలయును.

శ్లో॥ ఉమయా సహితం రుద్రం పృథ గష్టోత్తరం హునేత్ । గౌరీమిమాయ మంత్రేణ త్ర్యంబకేణచ శంకరమ్ ॥

తా॥ పార్వతీతోఁగూడిన సాంబమూర్తినిగూర్చి పూజచేసి గౌరీమిమాయ అనుమంత్రముచే పార్వతీదేవినిగూర్చియు త్ర్యంబకం అను మంత్రముచే సాంబమూర్తినిగూర్చియు వేఱువేఱుగా నూటయెనిమిది పర్యాయములు హోమముఁజేయవలయును.

శ్లో॥ ఆచార్యంచ సపత్నీకం వస్త్రాలంకార చందనైః । తోషయిత్వా శుచిం శాంతం గాంచదద్యా త్పయస్వినీమ్ ॥

తా॥ భార్యతోఁగూడ పరిశుద్ధుఁడును ఓర్పుగలవాఁడునగు నాచార్యుని బూజించి వస్త్రములు అలంకారములు మంచిగంధము మొదలగువానిచే సంతోషపెట్టి ఆయనకు పాలిచ్చెడు ఆవునీయవలెను

శ్లో॥ బ్రాహ్మణాన్ భోజయేత్పశ్చా ద్దక్షిణాభిః ప్రతోషయేత్ । దీనానం ధాంశ్చ సంతర్ప్యవ్యా చ్ఛిద్రం వాచయే త్తతః ॥

తా॥ బ్రాహ్మణులను భుజింపఁజేసి యనంతరము వారిని దక్షిణలచే సంతోషపెట్టి దీనులను గ్రుడ్డివాళ్ళను భోజనాదులచే సంతోషపెట్టి అనంతరము అచ్ఛిద్రమను పన్నమును స్వస్తిచెప్పించవలయును-

శ్లో॥ లబ్ధ్వానుజ్ఞాం బ్రాహ్మణేభ్యో బంధుభిస్సహిత శ్శుచిః । హృది స్మరన్ శివం భక్త్యా భుంజీత నియమేనచ ॥

తా॥ అనంతరము బ్రాహ్మణులవలన ననుజ్ఞపొంది తాను శుచియై హృదయంబున భక్తితో సాంబమూర్తిని దలంచుచు బంధువులతోఁగూడ నియమముతో భుజింపవలయును.

శ్లో॥ అనేనైవ విధానేన కుర్యా దుద్యాపనం వ్రతీ।

తా॥ వ్రతమును జేయువాఁడు ఈ విధానముచేతనే ఉద్యాపనమును జేయవలయును.

శ్లో॥ ఏవం యః కురుతే భక్త్యా ప్రదోష వ్రత ముత్తమమ్। శనివారేణ సంయుక్తం సోద్యాపనవిధిం నరః॥

తా॥ ఏ మనుష్యుఁడు భక్తిగలవాఁడై శ్రేష్ఠమైనదియు శనివారముతోఁ గూడిన ప్రదోషవ్రతమును జేసి ఉద్యాపన జేయవలెను.

శ్లో॥ ఆయురారోగ్య మైశ్వర్యం పుత్రపౌత్ర సమన్వితః। శత్రూ న్విజయతే నిత్యం ప్రసాదాచ్ఛంకరస్యచ॥

తా॥ అటువంటిమనుష్యుడు సాంబమూర్తియొక్క అనుగ్రహమువలన పుత్రులు మనుమలు మొదలగు సంపత్తులు గలవారై శత్రువులను జయించి ఆయురారోగ్యైశ్వర్యములనుబొంది యెల్లప్పుడు సుఖముగా నుండును.

శ్లో॥ తస్మాత్త్వ మపి రాజేంద్ర పూజయస్వ సదాశివమ్। ఏవం ప్రదోష విధినా యుద్ధే వృత్రం విజేష్యసి॥

తా॥ ఓ రాజశ్రేష్ఠుఁడా! అందువలన నీవును ఈవిధిగా ప్రదోషవ్రతమును జేసి సాంబమూర్తిని బూజించెదవేని యుద్ధమందు వృత్రాసురుని సంహరింపఁగలవు.

శ్లో॥ ఏవం నిశమ్య గురుణా కథితం తదానీ మింద్రోఽయమేవ విధినా గిరిశం ప్రపూజ్య। లోకం గ్రసంతమివ దైత్యపతిం ప్రవృద్ధం తం తత్‌క్షణా దగమయాత్ యమాలయం త్వష్ట్రీ యమిశతుష్ట్యా॥

తా॥ దేవేంద్రుఁడీ ప్రకారము బృహస్పతిచేఁ జెప్పబడిన వ్రతవిధానము నంతయు విని యథాథావిధిగా ప్రదోషవ్రతమును జేసి సాంబమూర్తిని బూజించి లోకమును మ్రింగులాగున నుండువాఁడును వృద్ధిపొందుచున్నవాఁడును రాక్షసులకు నధిపతియు నగు నా వృత్రాసురునితో యుద్ధముఁజేసి యాక్షణంబుననే సాంబమూర్తి సంతోషించునట్లుగా వృత్రాసురుని సంహరించెను

ఈశ్వరః। శ్లో॥ త్రయోదశ్యాం తథా రాత్రౌ సోపహారం త్రిలోచనం। నైవేద్యైః ప్రథమే యామే ముచ్యతే సర్వపాతకైః॥

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాఁడు. త్రియోదశి నాఁటి రాత్రి మొదటిజామున సర్వాభరణములతోఁగూడిన సాంబమూర్తిని యెవఁడు చూచుచున్నాఁడో వాఁడు సమస్తపాపములనుండి విడిచిపెట్టబడుచున్నాడు.

దేవ్యువాచ । శ్లో॥ దేవకేన విధానేన ప్రదోష వ్రత ముత్తమమ్। విధాతవ్యం నరైస్స్త్రీభి స్సంతాన ఫలసిద్ధయే ।

తా॥ ఓ స్వామీ! శ్రేష్ఠంబగు ప్రదోషవ్రతమును సంతాన ఫలమును కోరెడు పురుషులుగాని స్త్రీలుగాని యేవిధానముగాఁ జేయవలయునో చెప్పుమని పార్వతి సాంబమూర్తిని అడిగెను.

ఈశ్వరః । శ్లో॥ యదా త్రయోదశీ కృష్ణా మందవారేణ సంయుతా। అరబ్ధవ్యం వ్రతం తత్ర సంతానఫలసిద్ధయే ।

తా॥ సాంబమూర్తి చెప్పుచున్నాఁడు. యెప్పుడు బహుళ త్రియోదశీ శనివారముతోఁ గూడుకొనునో అప్పుడు సంతాన ఫలప్రాప్తికొఱకు ప్రదోషవ్రత మారంభింపవలయును.

శ్లో॥ ఋణనిర్మోచనార్థాయ భౌమవారేణ సంయుతా। ఆయురారోగ్య సిద్ధ్యర్థం భౌమవారేణ సంయుతా ।

తా॥ ఋణము తీర్మానమౌటను గోరినయెడలను ఆయుస్సు ఆరోగ్యము మొదలగు వానిని గోరినయెడలను మంగళవారముతోఁ గూడిన త్రియోదశియందుఁ బూజసేయవలయును.

శ్లో॥ ఏకవత్సర పర్యంతం ప్రతిపక్షే త్రయోదశీ । ప్రదోషే శివమభ్యర్చ్య నక్తం భుంజీత శంకరీ ॥

తా॥ ఓ పార్వతీ! ఒక సంవత్సరపర్యంతము ప్రతిపక్షమందు త్రియోదశియందు ప్రదోషకాలంబున సాంబమూర్తిని బూజించి రాత్రి భోజనము చేయవలయును.

శ్లో॥ తత్ర చోక్తేన్యమంత్రేణ వ్రతసంకల్ప మాచరేత్ । స్నాత్వాతు లోహితే భానౌ నద్యాదౌ నియమీ వ్రతీ ।

తా॥ ఆ వ్రతమునకుఁ జెప్పఁబడిన మంత్రముచే వ్రతమునకు సంకల్పముఁజేసి సూర్యుఁడు సాయంకాలంబున యెఱ్ఱఁబడుచుండఁగా

వ్రతమును జేయువాఁడు నియమముతోఁ గూడినవాఁడై నదికి వెళ్ళి స్నానముఁ జేయవలయును.

శ్లో॥ శివాలయే తతో గత్వా ప్రదోషే శివ మర్చయేత్॥

తా॥ అనంతరము శివాలయమునకు వెళ్ళి ప్రదోష సమయంబున శివుని బూజింపవలయును.

మూ॥ ఓం భవాయనమః । ఓం మహాదేవాయనమః । ఓం రుద్రాయనమః । ఓం నీలకంఠాయనమః । ఓం శశిమౌళయే నమః । ఓం ఉగ్రాయనమః । ఓం ఉమాకాంతాయనమః । ఓం ఈశానాయ నమః । ఓం విశ్వేశ్వరాయనమః । ఓం త్ర్యంబకాయనమః । ఓం త్రిపురుషాయనమః । ఓం త్రిపురాంతకాయ నమః । ఓం త్రికాగ్ని కాలాయనమః । ఓం కాలాగ్ని రుద్రాయనమః । ఓం నీలకంఠాయనమః। ఓం సర్వేశ్వరాయనమః ।

శ్లో॥ పంచామృతేన స్నపనమ భిర్మంత్రైః ప్రపూజయేత్ ।
దధిభక్తేన నైవేద్యం పక్వాన్నైః ఘృత సంయుతమ్ ।

తా॥ పంచామృతములచే స్నానముఁజేయించి భవాయ నమః అను మొదలగుమంత్రములచే బూజఁజేసి పెరుగుతోఁగూడిన యన్నమును నేతితో వండఁబడిన బూరెలు మొదలగు భక్ష్యములను స్వామికి నివేదనఁ జేయవలయును

శ్లో॥ దత్వా సుముఖ వాసంచ తాంబూలం క్రముకాదికమ్ ।
సమర్ప్యాష్ట దిశ స్తత్రి దీపానాజ్య సమన్వితాన్ ॥

తా॥ ముఖమును బరిమళింపఁజేయు పోకచెక్కలు లవంగాలు మొదలగునవి గలిగిన తాంబూలమునిచ్చి నేతిపుంచి వెలిగింపఁబడిన యెనిమిదిదీపములను యెనిమిది దిక్కులయందున నుంచవలయును.

శ్లో॥ యథా భవాన్ సమస్తానాం భక్తానాం పాపమోచనః ।
తథా వ్రతేన సంతుష్టః పుత్రం దేహి సులక్షణమ్ ।

తా॥ ఏ విధముగా సమస్తమైన భక్తుల పాపములను నశింపఁజేయుచున్నావో అ విధంబుగా ఈ వ్రతముచేతను సంతోషించినవాడవై మంచిలక్షణములుగల పుత్రునొసంగుమని ప్రార్థింపవలయును.

శ్లో॥ ఋణరోగాది దారిద్ర్య పాపక్షుద్రాప మృత్యువః। భయ శోక మనస్తాపా నశ్యంతు మమ సర్వదా ॥

తా॥ నా సంబంధమగు ఋణము, రోగము, దారిద్ర్యము, పాపము, అపమృత్యువు, భయము, శోకము, మనస్తాపము మొదలగునవి యన్నియు యెప్పుడును నశించుఁగాత.

శ్లో॥ పృథివ్యాం యాని తీర్థాని సాగరాంతాని యానిచ। అండ మాశ్రిత్య తిష్ఠంతి ప్రదోషే గో వృషస్యతు ॥

తా॥ పర్వతములయందుఁబుట్టి సముద్రములోఁ గలియుచుండెడి యెన్ని నదులు భూమియందుఁగలవో ఆ నదులన్నియు సాయంకాలమందు వృషభముయొక్క వృషణములయందుండును.

శ్లో॥ స్పృష్ట్వాతు వృషణౌ తస్యశృంగమధ్యే విలోక్యచ। పుచ్ఛంచ కకుదంచైవ సర్వపాపైః ప్రముచ్యతే ॥

తా॥ అందువలన ఆ వృషభముయొక్క వృషణములను స్పృశించి కొమ్ములమధ్యగా ఈశ్వరుని జూచినట్లాయెనా లేక తోకనుగాని వృభమునుగాని స్పృశించి నట్లాయెనా సమస్త పాపములనుండి విముక్తుఁడు కాఁగలఁడు.

శ్లో॥ నివేద్య కర్మజాతంచ దద్యా ద్విత్తానుసారతః। దక్షిణాం బ్రాహ్మణేభ్యశ్చ దత్వా మౌనం విసర్జయేత్ ॥

తా॥ తన కర్మముల నన్నియుఁ దెలియఁబఱచి తన శక్తికొలఁది దక్షిణలను బ్రాహ్మణులకొఱకు నిచ్చి మౌనము విడిచిపెట్టవలయును.

శ్లో॥ మందవారే ప్రదోషేతు శుక్లకృష్ణ త్రయోదశీమ్ । యశ్చతు ర్వింశతిం కుర్యా ద్యథోక్త ఫలమాప్నుయాత్ ॥

తా॥ శనివారముతోఁ గూడిన శుద్ధ త్రయోదశియందుఁ గాని బహుళ త్రయోదయందుఁగాని సాయంకాలంబునఁ బూజఁ జేయవలయును. ఇట్లెవఁడు ఇరువది నాలుగు పర్యాయములు యథావిధిగా వ్రతమును జేయుచున్నాఁడో యటువంటి వాఁడు శాస్త్రమందుఁ జెప్పఁబడిన ఫలమునంతయును బొందఁగలఁడు.

శ్లో॥ ఏవంరీ పూజా ప్రకర్తవ్యా శంకరస్య చతుష్టిదా। ఈప్సితంచ నరాణాంతు దదాతు భగవాన్ హరః ॥

తా॥ ఈ ప్రకారము సాంబమూర్తికి సంతోషమును గలుగ జేసెడి పూజను జేసినట్లాయెనా భగవంతుడగు సాంబమూర్తి సంతోషించి మనుష్యులకుఁ గోరిన కోరికలనిచ్చి సుఖింపఁ జేయఁగలఁడు.

శ్లో॥ య ఇదం శ్రుణుయాద్వాపి శ్రావయేద్య స్సమాహితః।
సిద్ధ్యంతితస్య కార్యాణి శంకరస్య ప్రసాదతః॥

తా॥ ఎఁవడు స్వస్థచిత్తము గలవాఁడై ఈ కథను వినుచున్నాఁడో అట్టివానికి సమస్త కార్యములు ఈశ్వరునియనుగ్రహము వలల సిద్ధిని బొందఁగలవు.

ఇతి శ్రీ స్కాందపురాణే శనిప్రదోష

వ్రతకథా సమాప్తా.



## శివాష్టోత్తరశతనామావళి

ఓం శివాయనమః
మహేశ్వరాయ
శంభవే
పినాకినే
వామదేవాయ
విరూపాక్షాయ
శశిశేఖరాయ
కపర్దినే
నీలలోహితాయ
శంకరాయ
శూలపాణియే
ఖట్వాంగినే
విష్ణువల్లభాయ
శిపివిష్టాయ
అంబికానాథాయ
శ్రీకంఠాయ
భక్తవత్సలాయ
భవాయ
శర్వాయ
త్రిలోకేశాయ
శితికంఠాయ
శివప్రియాయ
ఉగ్రాయ
కపాలినే
కామారయే
అంధకాసురసూదనాయ
గంగాధరాయ

ఓం లలాటాక్షాయనమః
కాలకాలాయ
కృపానిధయే
భీమాయ
పరశుహస్తాయ
మృగపాణయే
జటాధరాయ
కైలా వాసినే
కవచినే
కఠోరాయ
త్రిపురాంతకాయ
వృషాంకాయ
వృషభారూఢాయ
భస్మోద్ధూళితవిగ్రహాయ
సామప్రియాయ
సర్వమయాయ
త్రయీమూర్తయే
అనీశ్వరాయ
సర్వజ్ఞాయ
పరమాత్మనే
సోమసూర్యాగ్నిలోచనాయ
హవిషే
యజ్ఞమయాయ
సోమాయ
పంచవక్త్రాయ
సదాశివాయ
విఘ్నేశ్వరాయ

ఓం వీరభద్రాయనమః
గణనాథాయ
ప్రజాపతయే
హిరణ్యరేతసే
గిరీశాయ
అనఘాయనమః
భుజంగభూషణాయ
భర్గాయ
గిరిధన్వనే
గిరిప్రియాయ
కృత్తివాససే
పురారాతయే
భగవతే
ప్రమథాధిపాయ
మృత్యుంజయాయ
సూక్ష్మతనవే
జగద్గురవే
వ్యోమకేశాయ
మహాసేనజనకాయ
చారువిక్రమాయ
రుద్రాయ
భూతపతయే

ఓం స్థాణవేనమః
అహిర్బుధ్న్యాయ
దిగంబరాయ
అష్టమూర్తయే
అనేకాత్మనే
సాత్వికాయ
శుద్ధవిగ్రహాయ
శాశ్వతాయ
ఖండపరశవే అజాయ
పాశవిమోచకాయ
మృడాయ పశుపతయే
అవ్యయాయ హరయే
పూషదంతభిదే
అవ్యగ్రాయ
దక్షాధ్వరహరాయ
హరాయ భగనేత్రభిదే
అవ్యక్తాయ
సహస్రాక్షాయ సహస్రపాదే
అపవర్గప్రదాయ
అనంతాయ
తారకాయ
పరమేశ్వరాయనమః

శ్రీ శివాష్టోత్తర శతనామావళి సమాప్తం.

